# చిన్నమస్త



జయహో మాతా శ్రీ అనసూయా !
రాజరాజేశ్వరి శ్రీ పరాత్పరి !!

## శ్రీ అనసూయేశ్వరాలయంలో
## సహస్రఘట క్షీరాభిషేకము

# శ్రీ అనసూయేశ్వరాలయంలో

## సహస్ర ఘట క్షీరాభిషేకములు

ప్రియ సోదర సోదరీమణులకు,

మే 5 న అమ్మ కళ్యాణ దినోత్సవ సందర్భంలో జిల్లెళ్ళమూడికి వచ్చిన సోదరుల కోరిక ననుసరించి, జిల్లెళ్ళమూడిలో విద్యుత్ కోత, నీటి యెద్దడి, నీటి కాలుష్యం కారణములవల్ల 1996 జూన్ 12న జరుపదలచిన అభిషేకము వాయిదా వేసి మరి యొక పర్వదినమున జరుపుకుందామని నిర్ణయించి మీకు తెలియపరచటం జరిగింది.

అమ్మ అనసూయేశ్వరాలయంలోకి ప్రవేశించి 1996 జూన్ 12కు 11 సం॥ నిండి 12వ సం॥లోకి ప్రవేశించింది. ఈ సందర్భంగా 12 వ సం॥లో అనగా 1997 జూన్ 12 లోగా ఈ కార్యక్రమం జరపాలని సోదరుల అభిలాష.

హైమ, ఆలయ ప్రవేశం చేసిన 12వ సం॥లో (హైమ ఏప్రిల్ 1968లో ఆలయ ప్రవేశం 1979 నవంబర్‌లో కోటి నామార్చన) అమ్మ మనచేత "లలితా" సహస్రనామ కోటి పారాయణ చేయించి మనల్ని పునీతుల్ని చేసింది. ఆ వరవడిలోనే ఆలయ ప్రవేశం చేసిన అమ్మకు 12వ సం॥లో ఈ కార్యక్రమాన్ని జరపటానికి సంకల్పం జరిగింది. ఈ కార్యక్రమం ఏ పర్వదినాన చేయాలనేది సోదర సోదరీమణులకే వదిలి వారి వారి సలహాలను కోరుతున్నాము.

1) శరన్నవరాత్రులు, విజయదశమి — అక్టోబర్ 1996/ఆశ్వయిజం
2) హైమావతి జయంతి/హైమావతీ జనయిత్రి వ్రతం - నవంబర్/కార్తీకం
3) సంక్రాంతి — జనవరి 13/14 పుష్యం
4) నాన్న గారి ఆరాధనోత్సవాలు — ఫిబ్రవరి 17/మాఘం
5) వసంత నవరాత్రులు అమ్మ జన్మ దినం/ఏకాదశి - ఏప్రియల్/చైత్రం

ఈ పై అయిదు పర్వదినాలలోగాని లేక ఏ పర్వదినమయిన ఈ కార్యక్రమం జరుపుకోవచ్చు. కాన సోదర సోదరీమణులు ఏ రోజు ఈ కారక్రమం జరిపితే బాగుంటుంది; ఎట్లా నిర్వహిస్తే బాగుంటుంది అనే విషయంలో వారి వారి సలహాలు పంపవచ్చు. వాటినికూడా సహస్రఘట క్షీరాభిషేక సమితి ఆలోచనా పరిధిలోకి తీసుకొని నిర్ణయం చేయటానికి ప్రయత్నిస్తుంది.

ఈ యజ్ఞంలో అందరూ పాల్గొనాలని మా ఆకాంక్ష. అందరి చిరునామాలు మా వద్ద లేనందువల్ల షుమారు 500 మందికి మాత్రమే ఈ కార్యక్రమ వివరాలు, అమ్మ జీవిత మహోదధిలో ఒక తరంగాన్ని అందించ గలిగాము. కొందరు సోదరులు వారి వారికి తెలిసిన చిరునామాలు తెలియ పరుస్తూ వారికికూడా పంపవలసినదని ఎంతోసహృదయంతో కోరుతున్నారు. వారికి మా హృదయ పూర్వక అభివందనాలు అమ్మ జీవిత మహోదధిలోని "తరంగాన్ని" అందుకుని ఆనందించటమే కాక అందరికీ అందాలనే వారి ఆకాంక్ష మమ్మల్ని ఆనంద పరిచింది. ఏ కారణంగా నైనా అవి అందక పోతే ఆ కారణం మావద్ద వారి చిరునామాలు లేకపోవటమే! అందని వారి చిరునామాలు తెలియపరచి వారికి కూడా ఈ తరంగాలు అందేటట్లు చేయటంకూడా "అమ్మ"కు సేవే. అమ్మ యొక్క మాటలు అమ్మ నోటి గుండా వెలువడినవి సోదరుల అందరికి అందింపచేసి వారిని ఆనందింపచేసే మా ప్రయత్నంలో సహకరించాలని మా ప్రార్థన.

"అమ్మ" వేద స్వరూపిణి. లలితా సహస్రనామావళిలో చెప్పినట్లు "అమ్మ విద్యా విద్యా స్వరూపిణి. అమ్మ వద్దకు వచ్చిన ఒక యోగి వేదాంత చర్చ సందర్భంలో "ప్రజ్ఞానం బ్రహ్మ" అని అంటే అమ్మ తక్షణమే "అజ్ఞానం" బ్రహ్మ ఎందుకుకాదు అని విద్యను, అవిద్యను సోదాహరణంగా వివరించి అంతా "బ్రహ్మ" యే అనిచెప్పి తృప్తి పరిచి పంపింది. కారణం అమ్మ ఆ "లలితా" స్వరూపిణియే కనుక. అమ్మకు రెండులేవు. అంతా 'తానే', 'తాను' కానిదంటూ 'తనది' కానిదంటూ ఈ సృష్టిలో ఏమీలేదు అని అమ్మ, తల్లి (తొలి) అయి, ప్రకృతి అయి, విశ్వ జనని అయి మనల్ని దగ్గరకు తీసి, ఈ కనపడేది, కనబడని శక్తి అంతా తానేనని, "వ్యాపినీ వివిధాకార" అనే నామాన్ని మనకు విశ్లేషణ చేసింది.

మనల్ని ఆ ఎత్తుకు చేర్చిన మన అమ్మకు ఈ సహస్ర ఘట క్షీరాభిషేకం చేయాలనేది మన అందరి కోరిక, అమ్మ జరిపించు కోవాలని మా ప్రార్థన.

ఇంతవరకు, నిర్ణయించిన రు॥ 648/– పంపి సభ్యులుగా చేరినవారి సంఖ్య షుమారు రు. 100 కు పైన చేరింది. రశీదులు అమ్మ 'తరంగంతో' పాటు పంపటం జరుగుతున్నది. అందని వారు తెలియ పరచవలెనని ప్రార్థన. సభ్యులుగా చేరిన వారి వివరాలు రాబోయే తరంగంతో పాటు ముద్రించుతాము. సహస్ర ఘటములకు సహస్ర సభ్యులను చేర్చాలని మా ప్రయత్నం. అందులో అమ్మ ఎవరిని నిర్ణయించిందో చివరి వరకు ఆమెకే ఎరుక; సభ్యులుగా చేరకపోయినా అభిషేకంలో పాల్గొనటానికి అందరూ అర్హులే మరియు ఆహ్వానితులే!

సభ్యులుగా చేరినా చేరకపోయినా, అభిషేకానికి రా గలిగినా, రాలేక పోయినా అమ్మ జీవిత మహదధిలోని 'తరంగాన్ని' అందరికి అందించాలని

మా ప్రయత్నం సహస్ర ఘట క్షీరాభిషేకం నాటికి వీలయినన్ని 'తరంగాలను' మీకు చేర్చాలని అందులో మీరు తడవాలని, పునీతులు అవ్వాలని మా కోరిక.

అమ్మ ఒక సందర్భంలో అన్నది. జీవిత మహోదధిలోని తరంగాలను పారయణ చేస్తే 'సుందరకాండ పారాయణ' చేసిన ఫలం వస్తుందని, అందుకే ఎందరో ఇప్పటికి రోజూ కొన్ని పేజీలయినా, పంక్తులైనా పారాయణ చేస్తున్నారు. ఫలం పొందుతున్నారు.

సోదర సోదరీమణులు, వారి వారి చిరునామాలుగాని, Donations-Drafts, Cheques, M.O. గాని [redacted] in Favour of "AMMA SAHASRA GHATA KSHIRABHI- SHEKA SAMITHI." ఈ క్రింది చిరునామాకు పంపప్రార్థన.

ఇట్లు
రాచర్ల లక్ష్మీనారాయణ
కన్వీనర్
సహస్ర ఘట క్షీరాభిషేక సమితి

చిరునామా :-

R. Lakshmi Narayana,
4/1 Vidya Nagar,
H.No. 4-5-26/18,
Guntur-520 007.



# "జీవిత మహోదధిలో తరంగాలు"

## ఛిన్నమస్త

[అమ్మ అవతరణకు ముందు తరువాత ఎందరికో ఎన్నో అనుభూతులను ప్రసాదించింది. అవతరణ అనంతరం ఎందరో అమ్మను దైవంగా గుర్తించారు. అందులో మౌలాలి ఒక వృద్ధుడు, గుడ్డివాడు, కాని ఒక జ్ఞాన వృద్ధుడు. అపుడు అమ్మకు 11 సం॥ నిండి 12 సం॥ లోకి ప్రవేశిస్తుంది. మౌలాలి అమ్మ ఏ వూరిలో వుంటే ఆ ఊరిలో బిక్షాటనే చేసుకొని ఏ అరుగు మీదనో ఏ చెట్టు క్రిందనో కాలం వెళ్ళబుచ్చుతూ అమ్మను దర్శనం చేసుకుంటూ అమ్మ ధ్యాసతో వుంటూ, అమ్మకు ఎక్కడ ఏమి జరిగినా అది తన జ్ఞాననేత్రంతో అవలోకిస్తూ, తనకు వచ్చిన సందేహాలను నివృత్తి చేసుకోంటూ అమ్మను అనుసరించి వుండేవాడు. ఆ సందేశ/ సంభాషణ లోని ఒక భాగమే ఈ చిన్ని "తరంగం."]

భావన్నారాయణ స్వామి దేవాలయం వద్ద చింపిరి గుడ్డలతో ఒక సాయిబు ఎదురు వస్తాడు. చాలా సుస్తీగా వుంటాడు. అమ్మను చూచి అమ్మ ఎటు నడుస్తుంటే అటు తలతిప్పుతూ కన్ను ఆర్పకుండా అమ్మ వంకనే చూస్తాడు. అమ్మ కూడా అతని వంకనే చూస్తుంది. పాపం నా కోసమే చూస్తున్నాడు కాబోలు అనుకొని అమ్మ దగ్గరకు వెళ్ళి యేం నాయనా అని అనగానే చేతులుచాచి అమ్మను తన పొట్టలోకి తీసుకొని తలను గుండెలకు అదిమి పట్టుకొని ముద్దు పెట్టుకుంటాడు దగ్గరకు వచ్చేటప్పటికి యెంత చిన్న పిల్లవయినావమ్మా. ఇందాక చాలా భారీ మనిషిలాగా కన్పించావు. యెందుకనమ్మా ఇంత త్వరగా మారిపోయావు అంటాడు.

అమ్మ : నీకు యేం కావాలో చెప్పునాయనా ?

సాయిబు : నాకు నీవే కావాలమ్మా.

అమ్మ : నేను వచ్చానుగా దగ్గరకు. యెందుకు యేడుస్తావు?

సాయిబు : యేడుపుకాదమ్మా ఆనందం. నేను పుట్టటం సాయిబు ఇంట్లో పుట్టినా ఒక కోమటి యింట్లో పెరిగాను. ఆ ఇంట్లో అందరూ బ్రహ్మంగారి భక్తులు. అందువల్ల నాకు ఈశ్వరమ్మ అంటే చాలా ఇష్టం. ఈశ్వరమ్మ గురించి చదివేటప్పుడు ఒక రూపాన్ని నిర్ణయించు కున్నాను. నేను నిర్ణయించుకున్న రూపమే మీలో చూచాను, మీలో చూట్టం ఏమిటి? మీరే ననుకున్నాను. మీ రూపం చూస్తుంటే క్షణంక్షణం జరిగే మార్పు చాలా చిత్రంగా వుంది. మీ బస యెక్కడమ్మా?

అమ్మ : బస అంటే సభ అనా ?

సాయిబు : కాదమ్మా నీవు చదువుకోలా?

అమ్మ : ఈశ్వరమ్మను అంటివిగా. ఇంకా చదువెందుకు

సాయిబు : అవుననుకోమ్మా! మామూలుగా అడిగాను మీ ఇంటికి తీసు కెళ్ళమ్మా. అసలు మీ ఇల్లెక్కడ?

అమ్మ : స్టేషన్ దగ్గర అస్పత్రికి ఎదురుగుండా

సాయిబు : ఇప్పుడు నీవు యెక్కడికి పోతున్నావమ్మా ?

అమ్మ : చదలవాడ సుబ్బారావుగారి ఇళ్ళవైపు వెళుతున్నా

సాయిబు : మా ఇల్లు కూడా అటేనమ్మా. మీరు ఎవరింటికి వెళతావమ్మా?

అమ్మ : మంత్రి కిష్టయ్య గారింటికి.

సాయిబు : ఓహో ఆయన ఇంటికా ? ఆయన నాకు చాలా కాలం నుండి తెలుసు. ఆయన మీకు ఏమవుతారమ్మా

అమ్మ : నాకు తాతగారు అవుతారు.

సాయిబు : అయనకు యెవరూ అంత పెద్ద కూతుళ్ళు కొడుకులు లేరే. తాతగారయ్యేందుకు.

అమ్మ : వున్నా లేకపోయినా, నాకు తాతగారయినాడు.

సాయిబు : యెటువంటి తల్లి ఆయనకు మనుమరాలయింది. తిరిగి మీ ఇంటికే వెళదాం. రేపు వెళదాం తాతగారింటికి.

అమ్మ : సరేలే! నీవు ఇక్కడే వుండు. నేను వెళ్ళివస్తా అని అమ్మ ఒక అణా పెట్టి అరటిపళ్ళు తీసుకొని వెళ్ళిపోతుంది.

అమ్మ తిరిగి వచ్చి

గుడి దగ్గర సాయిబును కల్సుకొని ఇల్లు చేరుతుంది.
అమ్మ సాయిబును చిటికేశ్వరపు చెట్టు క్రింద కూర్చోబెట్టి ఇంట్లోకి వెళుతుంది. నాన్నగారు; భారతాంబగారు, తాతగారు

అంతా భోంచేస్తూ వుంటారు. అమ్మ సరాసరి పైకి వెళ్ళి పడుకుంటుంది.

చిదంబరరావు తాతగారు భోంచేసి భారతం చదువుతూ కూర్చుంటారు.

భారతాంబగారు, నాన్న గారు మాట్లాడుతూ గదిలో కూర్చొంటారు.

అమ్మ మేడమీద నుంచి దిగివచ్చి వంట మనిషిని అడిగి ఒక మనిషి అన్నం పెట్టించుకొని తీసుకువచ్చి సాయిబుకు పెడుతుంది. నాయనా! నీవు ఇక్కడే వుండు. అందరూ పడుకున్న తరువాత వచ్చి మాట్లాడుతానని అమ్మ తాతగారి దగ్గరకు వచ్చి కూర్చొంటుంది.

చిదంబరరావు
తాతగారు : భారతం చదవడం అపి, యే భాగవతం నడిపి వచ్చావు?

అమ్మ : నడిచేదంతా భాగవతమే!

తాతగారు : అదే నీవు నడిపేదేగా?

అమ్మ : వెళ్ళి నాన్నను చూసొచ్చా, వెళ్ళేటప్పుడు దారిలో భలే విచిత్ర మైన ఘట్టం జరిగింది తాతగారు!

తాతగారు : నీకు విచిత్రమైన దేమిటమ్మా!

అమ్మ : ఎవరో ఒక ముసలివాడు కట్టుకోవడానికి గుడ్డలు లేకుండా చినిగిపోయిన బట్టలు, శుష్కించి పోయిన శరీరం; మహా ఆర్తిగల మనస్సు, తిండికి కూడా లేనట్టు వుంది. యేమయినా ఇద్దామంటే నా దగ్గరయేమిలేదు.

తాతగారు : మన ఇంటికి తీసుకు రాక పోయినావా !

అమ్మ : తీసుకొస్తే ఏం చేస్తారు.

తాతగారు : మనతోపాటు పట్టెడన్నం తినేవాడు.

అమ్మ : మీరందుకు సిద్ధపడితే ఇప్పుడు మాత్రం రాడూ ?

తాతగారు ; అడుక్కోవటానికి వస్తే రోజూ ఇంతన్నం తీసుకువెళ్ళిపెట్టు.

అమ్మ : అతను అడుక్కునేవాడు కాడు. అతని పరిస్థితి నాకు బాగా తెలియదు· కలిసి మాట్లాడలేదు బాగా·

తాతగారు : నీకు ఎట్లా ఉత్సాహంగావుంటే అట్లాచేద్దాం, అతన్ని కనుక్కో.

అమ్మ : గుర్తులు చెప్పి వచ్చాను వచ్చేడేమో వాకిట్లోకి వెల్లి చూస్తా. అమ్మ వాకిట్లోకి వెళ్ళేటప్పడికి సాయిబు అమ్మనే ధ్యానం చేస్తూ వుంటాడు అమ్మవెళ్ళి దగ్గరగా కూర్చొన్నా గమనించడు.

అమ్మ : నాయనా! [సాయిబు పలకకుండా ధ్యానం చేస్తూ వుంటాడు] అతను లేచిందాకా వుండి నాయనా ! ఇల్లు చూపించానుగా. నీకు యెప్పుడు వీలయితే అప్పుడు వస్తూ వుండు. అన్నం కోసం బాధపడకు. ఇక్కడికేరా. తరువాత నేను వూరికి వెళ్ళే టప్పుడు తాతగారికి చెప్పిపోతా. ఇంకా ఇక్కడ నేను నాలుగు రోజులుంటా.

సాయిబు : సరే! వెళ్లొస్తానమ్మా అని పై గుడ్డ దులిపి భుజాన వేసుకొని అమ్మకు సాష్టాంగ నమస్కారం చేసి వెళతాడు.

చిదంబరరావు తాతగారు వూరికి వెళ్ళగానే అమ్మ మెల్లగా సీతాపతి తాతగారున్న చోటికి వెళ్ళటానికి ప్రయాణమవుతుంది. నిన్న కనపడ్డ సాయిబు కనబడతాడేమోనని బజారు వెంట వెతుక్కుంటూ వెళుతుంది. యెక్కడా కనబడడు. సీతాపతి తాతగారి ఇంటికి సమీపంలోకి వెళ్ళగానే పై నుంచి వస్తూ వుంటాడు. అతన్ని చూసి అమ్మ అక్కడే నిల్చుంటుంది. అతను అమ్మను చూడడు. తలవంచుకుని వస్తూవుంటాడు. అమ్మ గబగబా అతని దగ్గరకు వెళ్ళి నిల్చుంటుంది. సాయిబుకు కొద్దిగా కంటి మసక వున్నది. అసలు నీపేరు ఏమిటి నాయనా ? అని అమ్మ అడుగుతుంది.

సాయిబు : నా పేరు మౌలాలి.

అమ్మ : అసలు నీ ఉద్దేశ్యమేమిటో చెప్పు నాయనా ! ఏం కావాలి ఏమిటి ?

మౌలాలి : నాకేమి వద్దమ్మా! నీవు కావాలి.

అమ్మ : నేనున్నా అన్నీ కావలసినదేగా ?

మౌలాలి : నీ దగ్గరే వుంచుకోమ్మా.

అమ్మ : నేను ఒక చోట వుండను కదా! యెట్లా వుంచుకోను, వుంచుకోవటం అట్లా వుంచి నీకేదైనా జీవనానికి వుందా!

మౌలాలి : యేమీ లేదు తల్లీ !

అమ్మ : నేను ఏదైనా ఇస్తా తీసుకొని ఇది బెట్టి చీరాల ఆస్పత్రి దగ్గర నాను రొట్టె బన్, అమ్ముకుంటూ వుండు. బాగా ఖర్చు అవుతుంది. అని జడ కుప్పెలు తీసి ఇస్తుంది. (చేతిలోపెట్టి) బాధపడబోకు నాయనా. మళ్ళీ నీవు సంపాదించిం తరువాత నాకు ఇద్దువు గానిలే !

మౌలాలి : నిన్నేమన్నా అనరా అమ్మా మీ ఇంట్లోవాళ్ళు! ఇంట్లోవాళ్ళు అనేదేమిటి చిట్టి తల్లీ! చక్కగా వున్నావు ఇవి వేసుకుంటే. నాకీ బంగారపు వస్తువులు యెందుకమ్మా. నీ దగ్గర అట్టే పెట్టుకుని పట్టెడన్నం పెట్టు.

అమ్మ : నేను వూళ్ళో ఉండనుగా యెల్లుండి వెళ్ళిపోతున్నా.

మౌలాలి : నీవు యెక్కడికి వెళితే అక్కడకు వస్తానమ్మా

అమ్మ : అక్కడ వాళ్ళు నీకు అన్నం పెడుతుంటే వూరుకోవద్దూ?

మౌలాలి : వూళ్ళో అడుక్కుతిని నీదగ్గర వుంటానమ్మా!

అమ్మ : సరే అట్లా అయితే రా! ఇట్లా సంపాదించుకుంటే రేపు లేవలేని రోజులొస్తే నాలుగు రూపాయలుంటై.

మౌలాలి : నేను లేవలేని రోజు నీవేవున్నావుగా అమ్మా!

అమ్మ : నేను ఎప్పుడూ అక్కడే ఉంటానని నమ్మకమేమిటి?

మౌలాలి : నిన్ను బాధించకుండా నువ్వు వున్న వూళ్ళో వుండి దూరంగా వుండే నమస్కారం చేసుకుంటానమ్మా!

అమ్మ : సరే పోదాం రా! నీకు భార్యా, పిల్లలే లేరా?

మౌలాలి : లేరమ్మా! తల్లి, తోడు, నీడ, అన్నీ నీవే !

అమ్మ : సరే ! ఇక్కడే కూర్చో, నే వెళ్ళి మా నాన్న గారితో ప్రయాణ మెప్పుడో అడిగివచ్చి నిన్ను తీసుకు వెళతాను. అమ్మ తాత గారి దగ్గరకు వెళ్ళి నాన్నా యెప్పుడు వెళదాం మన్నవ ?

సీతాపతి తాతగారు : యెప్పుడో అప్పుడు వెళ్ళదాం, తొందరేం

మ్మ : తాతమ్మ ఒక్కతే వున్నదిగా?

సీ॥తాతగారు: ఫర్వాలేదు వెళ్ళదాంలే! నేను వచ్చి చెపు తాలేయెప్పుడువెళ్ళేది.

అమ్మ : సరే అయితే వేను వస్తా! తాతగారు మెదలకుండా వూరు కుంటారు. అమ్మ వచ్చేస్తుంది. పాయిబు దగ్గరకు వచ్చి

నాయనా! నేను యెప్పుడు వెళితే అప్పుడు తీసుకువెళతాను.

మౌలాలి : సరే! నేను వాకిట్లో నే వుంటానుగా పోదాం పద.

అమ్మ : నువ్వు మెల్లగా రా! నేను తాతగార్ని కల్సుకోవాలి పనుంది.

అని అమ్మ ముందు నడిచి వెళ్తుంది. తాతగారు ఇంకా రాలేదు, మౌలాలి మెల్లగా నడిచి వస్తూంటాడు.

అమ్మ అతని కోసం ఎదురు చూస్తూ కూచుంటుంది. ఆతను ఎంతసేపు చూసినా రాలేదు. ఉదయం 9.30 గంటలు అవుతుంది. వంట అవుతుంది. అమ్మ వంట మనిషి దగ్గరకు వెళ్ళి మీరు వెళ్ళేలోగా ఒక మనిషి అన్నం నా చేతికిచ్చి మీరు వెళ్ళండి.

వంటమనిషి: అట్లాగే అమ్మా! అని వి స్తట్లో పెట్టి (అమ్మకు) ఇస్తుంది.

మౌలాలి వస్తాడు; అమ్మ అతనికి అన్నం పెడ్తుంది.

యింతలో సీతాపతి తాతగారు వచ్చి ఎల్లుండి ప్రయాణమని చెప్తారు. అమ్మకు, మధ్యాహ్నం 1 గంటకల్లా చిదంబరరావు తాతగారు సుస్తారు. భోజనం చేయకుండానే వస్తారు.

అమ్మ : తాతగారు! నేను అన్నం పెడ్తా తింటారు?

చి॥తాతగారు: ఎందుకు తిననమ్మా! అంతకంటే కావలసినదేమిటి.

అమ్మ : తాతగారికి అన్నం పెడుతుంది. అందరూ నిద్రల్లుపోతుంటారు.

చి॥తాతగారు: మళ్ళీ ఎప్పుడు పెడతావు తల్లీ! బంగారు చేతులతో?

అమ్మ : ఎప్పుడో నాకు నీకు పెట్టే యోగ్యత ఉంటే అప్పుడు. మా ప్రయాణం ఎల్లుండి, తెల్సిందా మీకు?

చి॥తాతగారు: మొన్న యెవరితోనో నీవంటుంటే విన్నాను. ఆ సాయిబు సంగతి ఏం తేలింది.

అమ్మ : సాయిబుతో జరిగిన సంబాషణ అంతా చెప్తుంది.

చి॥తాతగారు: మనకు బరువు లేకుండా అతను అడుక్కు తింటే యిబ్బంది ఏముంది? ఒకప్పుడు మాత్రం బరువేముందనుకో! ఒక మనిషికి అన్నం పెట్టడం బరువుకాదు. అది ఇంట్లో వాళ్ళ యిష్టాఅయిష్టాల మీద ఉంటుంది. ఇటువంటి వాటికి తాతమ్మ ఏమందుగా. తాతమ్మ అన్నం పెడ్తుంది. ఆమెకేం సందేహం లేదు. ఒచ్చేటప్పుడు మంచిగానే వస్తారు. తరువాత మళ్ళీ బాధ్యతను వాళ్ళు గుర్తుంచుకోరు మర్చిపోతారు.

అమ్మ : ప్రాప్తమున్ననాళ్ళు వుంటారు. తరువాత అతని దారిన అతను వెళ్ళి పోతాడు.

చి॥తాతగారు: అంతేననుకో! అతన్ని చూడలేదు. ఏడీ ? అతను ఎక్కడ వున్నాడు. అమ్మ వాకిట్లోకి వెళ్ళి చిటికేశ్వరపు చెట్టుక్రింద వున్న సాయిబును లోపలకు పిల్చుకొని వచ్చింది.

మౌలాలి చిదంబరరావు తాతాగారికి నమస్కారం చేస్తాడు. చిదంబర రావు తాతగారు కూడా చేస్తారు. ఇద్దరూ ఒకర్ని ఒకరు చూచుకొని నవ్వుకుంటారు కాని పలుకోరు.

అమ్మ : 10 రూపాయలు ఇద్దాం! ఏదో తగిన వ్యాపారం చేసుకో మని చెప్పండి తాతగారు మీరు.

చి తాతగారు: యేమిటి నాయనా ? ఏమిటి నీ జీవనం ?

మౌలాలి : ఏముంది నాయనా! నాకు మొదటి నుండి బ్రాహ్మలతో స్నేహం. నాది అసలు నాగులపాడు. మా తాతలు ఎవరో, ఈ వూరు వచ్చారు. తాతల దగ్గర నుండి మేము నమాజుకు వెళ్ళేవాళ్ళం కాదు ఖురాను చదివి ఎరుగం. మా నాన్న గారు కృష్ణ భక్తుడు. నాకు చిన్నప్పటి నుండి బ్రహ్మం

గారంటే చాలా యిష్టం. మా ఆస్తి అంతా పోయింది. బంధువులు అందరూ పోయినారు. ఒక్కడినే మిగిలాను. తల్లి లేదు. తండ్రిలేడు. తల్లి లేదంటున్నాను. దరిద్రుడిన్ని తల్లి దొరికింది; ఆ బ్రహ్మంగారి మనుమరాలు ఈశ్వరమ్మ. నాకు ఈ అమ్మగా కన్పించింది· ఈమెకు ఆమెకు భేదం లేదనుకున్నా నేను సిద్ధయ్యంత కాకున్నా కనీసం "అమ్మను" గుర్తు పెట్టుకునే స్థితన్నా ఉంటే చాలు. ఒదిలిపెడ్తే ఆ గుర్తుకూడా ఉండదుగా. అందుకని అమ్మను దగ్గర ఉంచుకొనేస్థితి లేదు కనుక దగ్గర ఉందామని నా కోసం ఏడ్చేవారు ఎవ్వరూలేరు. నన్ను చూసి సంతోషించేవారు లేరు. అందుకే అమ్మను కష్టపెట్టకుండా ఎక్కడైనా అడుక్కొచ్చుకుని తింటూ అమ్మను చూస్తూ యీ పంచలో ఉంటాను.

చి॥తాతగారు : సరే నీ యిష్టం. దూరమాలోచించుకో! అమ్మాయికి వివాహమైతే అత్తవారింటికి పోతుంది. అప్పుడు ఎక్కడుంటావు ?

మౌలాలి : అప్పుడు ఏ వూరు వెళ్తే ఆ వూళ్ళో అడుక్కుంటా!

చి॥తాతగారు: సరే నీ యిష్టం, అన్నింటికి సిద్ధపడి ఉన్నావు కనుక ఒకరి సలహాతో ఏం పనివుంది? రేపు ప్రయాణం అన్నం తీసుకొచ్చి పెట్టు అంటారు. అమ్మతో!

మౌలాలి : ఇందాకనే పెట్టిందయ్యా!

చి॥తాతగారు: లోపలికి పోదాం పదమ్మా!

రెండు నెలలు గడిచిపోతాయి. (అమ్మ మన్నవ గ్రామంచేరి)

మౌలాలి యీ రెండు నెలల నుంచి దొప్పలపూడిలో అడుక్కుతింటూ అమ్మను వచ్చి చూచిపోతూ వుంటాడు. ఒక రోజున వాకిట్లోకి వస్తాడు. మధూకరం కోసం అమ్మ ముద్ద వేయటానికి వాకిట్లోకి వెళుతుంది.

మౌలాలి : యెందుకమ్మా అట్లా వున్నావు.

సుబ్బమ్మ : లోపల నుంచి కేక, యేమిటి అడక్కుండా. పెట్టకుండా మూత దీసి, యీ కేక వాకిట్లోకి విన్పిస్తుంది. అతను అన్నం పెట్టించు కోవటానికి బాధపడతాడు. నేను అన్నంకోసం రాలేదు· నిన్ను చూడటానికి వచ్చానమ్మా, అన్నం తీసుకెళ్ళిగిన్నెలో వేసిరా అమ్మా.

అమ్మ : అట్లావద్దు నాయనా! నీకు తెచ్చిన అన్నం ఇంట్లో వేస్తే పోట్లాడుతారు.

మౌలాలి : సరేలేమ్మా! యీ రోజుకు పెట్టు.

అమ్మ : మౌలాలి మాట్లాడటం చూచి, యెవరా అబ్బాయి ? యెందుకు ఇంతసేపు మాట్లాడతావు. అడుక్కునే వాళ్ళతో యేమాలోచనట. చిన్నప్పుడు లేనిది పెద్దప్పుడు వస్తుందా? యెందుకు మగవాళ్ళతో ఇంతసేపు ఆలోచన అంటుంది. సుబ్బమ్మగారు (అమ్మ మేనత్త)
"జీవితంలో ఇదే ప్రారంభం అనుమానించటానికి అనుకుం టుంది. అమ్మ"

మౌలాలి : నేను రానులేమ్మా! యెప్పుడన్నా ప్రాప్తముంటే చూచి పోతూ వుంటా!

మర్నాడే సుబ్బమ్మగారు పిల్లలు గరికపాడు వెళ్ళాల్సి వస్తుంది. రాఘవరావు మావయ్య తెనాలిలో వున్నారు. మరిడమ్మ తాతమ్మ బాపట్లలో వున్నది.

అమ్మ అచ్చగా ఆ రోజు నుంచి తోటలోనే వుంటుంది. 11 రోజులు ఒకే చెట్టు క్రింద కదలకుండా కూర్చొంటుంది. ఈ 11 రోజులు కూడా యేమయిందని అని కనుక్కోరు. 12వ రోజు కళ్ళు తెరిచేటప్పటికి నాలుక విరుచుకు పోతుంటుంది. దగ్గరలో యెక్కడా మంచి నీళ్ళు లేవు. ఆ చెట్టు మాను వంకనే ఒక అరగంటచూస్తూ కూర్చొంటుంది. మాను పగిలి పోతుంది. ఆ పగిలిన చప్పుడు వచ్చే ధ్వని "ఓంకార" ధ్వనిగా, పెద్ద మోతగా పిడుగు

పడినట్లుగా వూరంతా వినిపిస్తుంది. వెంటనే మేఘాలు పట్టి పెద్ద వర్షం కురుస్తుంది. వూరంతా చల్లబడుతుంది. చచ్చిపోయేవన్నీ బ్రతుకుల్లై, ఆ సంవత్సరం ఆ గ్రామానికి అదే తొలకరి వాన. అయిదు రోజులకల్లా భూమిఅంతా పచ్చబడుతుంది. అమ్మ ఆ వానలో అక్కడేవుంటుంది. అది పగిలినపుడు దానిలోనుంచి నురుగు నురుగుగా కారుతూ వుంటుంది. అమ్మపోయి దోసిళ్ళతో రసం తాగుతూ వుంటుంది. అమ్మ దాహం తీరేదాకా కారుతుంది. దీవిని "తింత్రిణీ సుధ" అంటారు. యెటు జూచినా నాగజెముడుమట్ట; చింతలు, ఆ చింతల్లోనిచింతే నా దాహన్ని తీర్చింది. అమకుంటుంది అమ్మ, యెపుడూ నాకు చింతలే కావాలి; చింతే నీడను ఇచ్చింది. చింత అండన యెండ తీర్చుకున్నాను. చింత రసమే దాహం తీర్చింది. రేపునేను ఈ వూరి నుండి వెళ్ళేటప్పుడు కూడా యీ చింతే తీసుకెళ్తా. యీచింత నా చెంతనుండి నా మనస్సుకు యే చింతాలేకుండా చేస్తుంది, ఒక పరికిణీ చొక్కాతో ఎండకు ఎండుతూ; వానకు తడుస్తూ అక్కడే ఇంకో 11 రోజులు గడుస్తాయి.

(మౌలాలి దొప్పలపూడిలో ఆడుక్కుంటూ రోజూ తోటలోకి అమ్మ దగ్గరకు వచ్చి వెళుతూ వుంటాడు.)

అన్ని రోజులు ఇంటికి రాకపోయినా అమ్మ ఏమయిందని ఇంటివద వారు ఆలోచించరు. 23 రోజులు ఇట్లాగే గడిచిపోత్తై;చెట్టు క్రింద, మౌలాలి ఎక్కువ కాలం దొప్పలపూడి రాక మానుకొని తోటలోనే వుంటాడు. మౌలాలికి యేవేవో కొత్త కొత్తఅనుభవాలు కలుగుతూ వుంటాయి. ఏ రోజుకు ఆ రోజు. యీ తల్లి ఈశ్వరమ్మ తల్లి కంటే గొప్పది. యీ తల్లి ఇట్లా లోపల్లోపల యెంత మందిని తరింప చేస్తున్నదో! అమ్మతో– యేవమ్మా యేనాటికైనా బయటకు వస్తావా! నీకు తెలియకుండానే నీ శక్తులే బయటకు రప్పిస్తాయిలే అమ్మా. నిన్ను గురించి యేవేవో వూహలు వస్తున్నాయి గాని వర్ణించుకుండా మనిన చదువు రాదమ్మా.

కూర్చొంటే ఏదో మయికంగా వుంటుంది. ఆ మయికంతోనే మాట్లాడక పోయినా నీతో మాట్లాడు తున్నట్లు వుంటుంది. రకరకాల రూపాలు కనపడతాయి. యెన్ని రూపాలు కనబడ్డా నీవే

అనిపిస్తుదమ్మా యెవరో ఏమిటోలే అనిపించదు. నీ కంటే చిన్న పిల్లల్లే కనబడ్డా, నీవే అనిపిస్తుంది. ముసలి వాళ్ళల్లే కనిపించినా నీవనే అనిపిస్తుంది. పురుషులుగా కనుపించినా అట్లాగే. అది వరకు ఇంత లేదు. వారం రోజుల నుండి జాస్తిగాఅనిపిస్తుంది. యెక్కడయినా చెడువాసనవచ్చి ముక్కు మూసుకుంటే వెంటనే అందులో నుంచి మంచి వాసన వస్తుంది. మంచి వాసన గల వస్తువు ముక్కు దగ్గర పెట్టుకుంటే దుర్వాసన వస్తుంది. వస్తువుతీసి వేసినా ఆ వాసన పోదు. ఒక అనుభవమేమిటి? యేదని చెప్పేది. అన్నం బాగా పెడతారు. అనుకున్న ఇంట్లో పెట్టరు. సరిపోతుంది అనుకున్న నాడు సరిపోదు. నా తిండి ప్రమాణం కూడా నాకు తెలియదు. ఆకలిలేదు కదా కొద్దిగా తిందామనుకున్ననాడు యెక్కువ పోతుంది. ఆకలిగా వుంది తిందామనుకున్న నాడు పోదు. ఇదంతా ఏమిటి? అది సరే, నిన్ను వదిలివెళ్ళి అడుక్కుందామనిపించటం లేదమ్మా. అన్నింటికీ నిన్నే నమ్ముకున్నపుడు ఆకలి మాత్రం నీవు తీర్చవూ. ఇవన్నీచూస్తే "నా ప్రయత్నం"లేదని స్పష్టంగా తేలిపోతుంది.

అమ్మ ఇవన్నీ వింటూ కళ్ళు మూసుకొని తలవంచుకొని అట్లాగే కూర్చొంటుంది. ఆలాకూర్చున్న కూర్చోవటం అయిదు రోజులు అట్లాగే కూర్చుంటుంది.

మౌలాలీ అమ్మను చూస్తు అమ్మలో కల్సిపోయినవాడిలాగా; చైతన్యం లేనివాడిలాగా కన్ను ఆర్పకుండా కూర్చుంటాడు. అమ్మ వంటి మీద అనేక రకాల పక్షులు వాలిపోతున్నా కొట్టాలని అనుకుంటాడు కాని కొట్టలేడు. అనేక రకాల పురుగులు పాకుతూ వుంటాయి. తీసి వేద్దామనుకుంటాడు చేతులు లేవవు; కాళ్ళు కదలవు. కనురెప్ప కొట్టడానికి కూడా స్వాధీనం కాదు శరీరం. కనబడ్డది గుర్తిస్తాడే కాని యేమీ సంకల్పాలు గూడా రావు. ఇట్లా 5 రోజులు గడిచిపోతాయి. ఆ రోజు పౌర్ణమి అవుతుంది. నిండు పౌర్ణమి. ఆ రోజు రాత్రి 12 గం॥ అప్పుడు అమ్మ చుట్టూరా

చుట్టేసుకొని పైన గొడుగులాగ పడగ విప్పి లెక్కవెయ్యటానికి వీలు లేనన్ని శిరస్సులతో అమ్మ తలకు అర్ధగజం యెత్తున అనేక రంగులతో ఆ వెన్నెల కాంతిలో మెరిసిపోతూ ఆ కాంతిలో తలలూపుతూ ఆడుకుంటున్నట్లు కనబడుతుంది. నా భ్రమా; నిజమేనా అని అమ్మ దగ్గరకు వెళ్ళి చూస్తాడు. ఇంకా యెక్కువ కాంతిగా కనబడుతుంది.

దగ్గరకు పోయినకొలది గొడుగు ఆకారంగా ఒక్కొక్క శిరస్సు ఒక్కొక్క గొడుగు కడ్డీగా కనబడుతుంది. పాము చర్మం గొడుగు గుడ్డలా వుంటుంది. క్రిందవైపున పాము చర్మము గొడుగు కర్రలా వుంటుంది. పామును అమ్మ పట్టుకున్నట్లు ఇంకా చూడగా చూడగా విష్ణుమూర్తి శేషసాయి మాదిరిగా అమ్మ పడుకొని కనపడుతుంది. అమ్మకు ఆదిశేషుడు గొడుగై యెండకు; వానకు కాపాడుతున్నాడను కుంటాడు. ఇంకా చూస్తూ, చూస్తూ వుండగానే అనేక రూపాలు వస్తాయి. అమ్మను కాపాడుతున్నాడు అని అమ్మ వంకనే చూస్తూ వుండగా రూపాలన్నీ పోయి అమ్మ ఒక్కటే కిరీటంతో వర్ణించటానికి వీలుగాని రూపంతో అనేకమైన తలలతో ఒకే అమ్మ కనబడుతుంది· ఇన్నీపోయి అమ్మ ఒక్కటిగానే కనబడుతుంది. అప్పుడు అమ్మను కాపాడేదేమిటి? అన్నీ అమ్మరూపాలే అయితే అనిపిస్తుంది. యెప్పుడూ యీ దృశ్యాలు చూడాలని వుండేది నాకు. ఇష్టమయినవే చూపించిందే అమ్మ. నా కోరిక తెల్సుగా, అమ్మ నన్ను తరింపచేసింది· ఇక నాకు జన్మలేదు· నా జన్మకు మూలమే అమ్మ; నాకు కనిపించిన అవతారాలకు మూలంకూడా అమ్మే. అన్నింటికి "అమ్మే" మూలమని గుర్తించటమే జన్మ తరించటం, గుర్తించటం అంటే మాటలతో కాదు. మనోవాక్కాయ కర్మల గుర్తించటం అదే బ్రహ్మను తెల్సుకోవటం" బహ్మంగారు చెప్పిందికూడా ఇదేగా, బహ్మంగారు చెప్పారు, అమ్మ చూపించింది.

అమ్మ కళ్ళు తెరిచి మాములుగా కూర్చొని యేమిటి మౌలాలీ నీలో నీవే మాట్లాడుకుంటున్నావు.

మౌలాలీ : ఏమీ లేదమ్మా ! నేనుకూడా భగవంతుడ్నేనని గుర్తిస్తున్నాను అదేగా బ్రహ్మంగారి తత్వాలలో చెప్పేది. నేనే" బ్రహ్మనురా అనేగా ?

అమ్మ : అయితే నీవు బ్రహ్మవైనావన్న మాట.

మౌలాలీ : నిన్ను బ్రహ్మంగా గుర్తించాను కనుక నేను బ్రహ్మనైనా యేమిటోనమ్మా ఇప్పుడు అంతా తెలిసిపోయినట్లుంది. యెక్కడా గోడలు అడ్డం లేవు ఇప్పుడు నిన్ను వదలిపెట్టివుండగల్గునమ్మా

అమ్మ : నిన్నటికీ, ఈ రోజుకూ వచ్చిన మార్పేమిటి మౌలాలీ?

మౌలాలీ : నిన్న ఈ స్థితి లేదు కదా! నీకు తెలియకుండానే నాకు తెలుసా అమ్మా ? యేదయినా నీవు ప్రసాదించిందే!

అమ్మ : నాకేం తెలియదు నాయనా !

మౌలాలీ : పాపం నీకేం తెల్సు చిట్టితల్లివి. అనేక రూపాలతో ప్రపంచం చుట్టుముట్టేశావు. అమ్మ లేచేటప్పటికి తెల్లవారు ఝామున 4 గంటలు అవుతుంది. నాగజెముడు పళ్ళు కోసుకొచ్చి మౌలాలీకి పెడుతుంది.

మౌలాలీ : (ఆ పళ్ళుచూచి) నాకు ఇప్పుడు ఏమీ తినాలని లేదమ్మా. ఈ దృశ్యాలు అన్నీ చూడక ముందు అనుకున్నాయీ పళ్ళు తిందామని ఈ తోటతోనే వుండి యీ పళ్ళు తింటూ కాలం గడుపుదామనుకున్నా అంటూ చేతికి తీసుకొని తింటాడు.

అమ్మ : ఈ రోజు ఇంటికి వెళ్ళివస్తా మౌలాలీ!

షౌలాలీ : నేను ఇక్కడే వుంటా అమ్మా, సరే పోయిరా.
అమ్మ ఇంటికి వెళుతుంది. అమ్మ ఇంటికి వెళ్ళే ఒక గంట ముందు తాతమ్మగారు వచ్చి వుంటుంది.

నల్ల ఖాసిం, తాతమ్మగారు, సీతాపతి తాతగారు కూర్చొని పెళ్ళి కబుర్లే చెప్పుకుంటుటారు. అమ్మనుజూచి నల్లఖాసిం యేం అమ్మా 20 రోజుల క్యాంపు కొట్టావు. తాతమ్మగారితో కూడా తిరుగుతున్నావా ?

తాతమ్మ : నేను తీసుకువెళ్ళలేదురా. ఇక్కడే వదలిపెట్టి వెళ్ళాను.

తాతగారు : నాకు తెలియదు, మీతో వచ్చిందనుకుంటున్నా,

తాతమ్మ : అయ్యో తల్లీ! ఎక్కడ తిరుగుతున్నావే ?

అమ్మ : ఎక్కడకీ వెళ్ళటంలా.

తాతగారు : యెక్కడికి పోతుందిలే ! చింతలపూడి నరసింహంగారి ఇంట్లో వుందో, వాళ్ళ పిన తండ్రి అంబారావుగారి ఇంట్లో వుందో.

నల్లఖాసిం : నేను వెళ్ళానయ్యా మొన్న ! యెక్కడా కనబడకదయ్యా !

తాతగారు : మన ఆలోచన లెందుకు ? ఫలానాచోట వున్నానని అది చెప్ప కూడదూ ?

అమ్మమ్మ : నీవు వెళ్ళిన తరువాత 2 రోజులు కన్పించింది సుబ్బమ్మో దినా వాళ్ళ వెళ్ళిం తరువాత అసలే కనిపించలా ! వాళ్ళతో వెళ్ళిందనుకున్నా' అని తాతమ్మతో అంటుంది.

తాతమ్మ : ఇంత పట్టించుకోకపోతే యెట్లా నాయనా ? పసిబిడ్డ కదా! నేను మీరంతా వున్నారని కదా వదిలి పెట్టి వెళ్ళింది ?

తాతగారు : ఇంట్లోవుంటే సరిపోతుంది. యెక్కడో వుంటే ఎవరు కనిపెట్టి వుంటారు?

అమ్మమ్మ : అన్నం తిందువుగానిరా అంటుంది. ఉదయం 11 గం॥ అవుతుంది. పిలవంగానే పోయి అమ్మ అన్నం తింటుంది. అందరూ అన్నాలు తిని పడుకుంటారు.

అమ్మ మళ్ళా అన్నం తీసుకుని తోటలోకి వెళ్లతుంది.

మౌలాలి భోం చేస్తాడు. ఇంకా చాలాజంతువులకు కూడా ఆహారం వేస్తుంది. నీ వాలకం చూస్తే కాశీ అన్న పూర్ణమ్మ తల్లివెలె వున్నావమ్మా ఒకరికి అన్నం తెచ్చి ఇంతమందికి పెట్టావు ముందుముందు అంతే చేస్తావను. కుంటా.

అమ్మ : నికే నయం మౌలా. రాబోయే సంగతులు తెలుస్తున్నాయి.

మౌలాలి : నీ దయ వుంటే తెలియకేం అమ్మా !

అమ్మ : నా దయ యేమిటి.

మౌలాలి : నీ దయ లేకపోతే ఎక్కడో తోటలో కూర్చొని భగవంతుడితో అన్నంతెప్పించుకు తింటున్నానమ్మా. నిన్నుగుర్తింప చేసావు గదా. అసలు యదార్థం చెప్పమంటావా?నిన్ను చూడకముందే నాకు బాగా దృష్టి దోషం కూడా వుంది. నిన్ను చూడటమే నా దోషం పోవటం.

అమ్మ : దృష్టి దోషమంటే చూచేదా ?చూచి గ్రహించే దృష్టా?

మౌలాలి : చూచేది వేరు. చూచి గ్రహించేది వేరా. అమ్మా?

అమ్మ : చూచేది కళ్ళు; చూచి గ్రహించేది మనస్సు.

మౌలాలి : చూచేదేలేదమ్మా నాకు మధ్యలో స్ఫోటకం పోసింది. అందులో చూపు మందగించింది.

అమ్మ : మందగించింది అంటే అసలు లేదనా? తగ్గిందనా?

మౌలాలి : అప్పట్నుంచి దాదాపుఅసలు లేదనేచెప్పాలి.

అమ్మ : యెట్లా కనిపించదంటావు. నీకు కళ్ళే కనబడకపోతే బజార్ల మ్మట ఎట్లా తిరుగుతున్నావు ?

మౌలాలి : కనబడి కాదమ్మా సొజ్ఞతో తిరుగుతున్నా, పిచ్చి తల్లీ ఇంత సంభాషణెందుకు, నీ కరుణ నీకు తెలియకుండా ప్రసరించింది. ఆ యమ్మగా అంటే పోలేరమ్మరూపంలోవచ్చి కళ్ళు తీసేసావు. జగదీశ్వర రూపంతో వచ్చి కళ్ళు ఇచ్చావు. నీలోనే కలుపు కుంటివిగా తల్లీ. శరీరాన్ని వేరు చేసావుగాని శరీరాన్ని కూడా తొందరగా కలుపుకో తల్లీ. నీకు తెలియకుండా వచ్చిన అను భవాలు వున్నాయా తల్లీ. సరేగాని అమ్మా మొన్న నీ నెత్తిన గొడుగల్లె పామున్నదే యెందుకని ?

అమ్మ : యేమో మౌలాలి మొన్న యీమద్య 'నాకూకూడా మధ్యాహ్నమ ప్పుడు కూర్చొని నిద్రపోయి లేచాను. కళ్ళు తెరిచేటప్పటికి నా నెత్తిన నాకు అట్లాగే కనబడ్డది. పక్కకు తిరిగితే పక్కన, యెదురు చూస్తే యెదురు గుండా యెటు చూస్తే అటల్లా కన బడ్డది నాకు. చింతచెట్టు వేపుచూస్తే చింతచెట్టుఅంతా అదిగానే కనబడ్డది.అయినాయిదేంటో చూద్దామని రోడ్డునే బయలుదేరితే రోడ్డునే నేనడిచినట్టే నడుస్తున్నది. చివరకు శివాలయం వాకిలి ముందరనుంచున్నా ధ్వజం వంకచూస్తేద్వారం పొడుగునా కన బడ్డది.నా పాదాల దగ్గర నుండి గుడి వాకిలిదాకా వున్నది. ఇది యేమిటని భావనారాయణ స్వామి దేవాలయానికి వెళ్ళాను. అక్కడా వున్నది. అక్కడ కూర్చున్నాను. చివరకు ఇదేమిటని తోచింది. ఇదంతా నాలోదే ననిపించింది. నాలో యెక్క డున్నదని నాలో నాకే ఆలోచన వచ్చింది.

పాము చుట్టలు చుట్టుకుని పడగయెత్తి నుంచున్నప్పుడు యెట్లా ఉంటుంది ? మనిషి కూర్చున్న ఆకారంగా వుంటుంది. అదే "బ్రహ్మదండి" అంటారు. వెన్నెముక క్రిందుగా వుంటుంది

ఆ నాడి. అదే "సుషుమ్న". అదే బ్రహ్మం గారి తత్వాల్లో వచ్చేది,నీకు తెలియకుండావున్నదా?ఒక మనిషిని జుట్టుపూర్తిగా తీసేయించి నుంచోబెట్టి వెనుకపక్క నుంచి ఆ తల చూస్తుంటే నాకేమో పడిగాకారంలా తోస్తుంది. ఆ తల ఎవరి తలలయినా అనిపిస్తాయి. పాము ఆకారం యెట్లావుంటుందో మన శరీరంలో వుండే "సుషుమ్నా నాడి"అట్లాగే ఆ పాదము వుంటుంది.దానికి కేంద్రస్థానము, నడుము దగ్గర్నుంచి శిరస్సు దగ్గరకుచెప్పాము. అంతమాత్రంచేత నీ శరీరమంతాలేదనికాదు.కొందరు సాధకులు ఉఛ్వాస నిశ్వాసాల ద్వారా గుర్తిస్తారు. కొంతమంది రెండు కనుబొమ్మల మద్య దృష్టిని నిలిపి దాని ద్వారా గుర్తిస్తారు. అదే "కుండలినీ ప్రభోధమని" పడుకున్న పామును కొడితే తలెత్తి బుసకొట్టినట్లుగా కొంతమంది సాధకులు హఠయోగము అని చెపుతారు దాన్నే, అదే "సహస్రారానికి" వెళ్ళిందంటారు. స్థానాల్లో కేంద్రీకరణ యెందుకంటే విగ్రహారాధన వంటిది, అనేకమంది అనేక రకాల విగ్రహాలు పెట్టుకుని ఒక విషయం కోసమే కృషి చేయటంలా? ఒకే స్థితికి అనేక సదుపాయాలు ఒక మేడకు నాలుగు వైపులా మెట్లు వేసినట్లు.

మౌలాలి : అయితే బయట సర్పమల్లే కనబడటమెందుకమ్మా?

అమ్మ : లోపల యేదో వెలుపలా అదేనని. రెండు కాదని. ఇందాక నీవు అనలా?

మౌలాలి : యేమన్నానమ్మా?

అమ్మ : బ్రహ్మనైనా నంటివే. యెట్లా అయినావని అడిగితే బ్రహ్మను చూచి బ్రహ్మను అయినానన్నావు, చూపించింది, చూచింది ఒకటైందిగా?

మౌలాలి : యేమో! ఇవన్నీ నాకొద్దమ్మా, నీవు దేవుడివి. యెబ్బేకాదు. నీవు అమ్మవు, నేను బిడ్డను. అన్నీ నీవు చేయిస్తున్నావు;నేను చూస్తు న్నాను;అనేది చాలాహాయిగా వుంటుంది. ప్రతీదిదానంతట అదే కలుగుతుందన్నారుగా అమ్మా. సరేగాని నా చేత ఇట్లాగు ర్తింప చేశావనుకో నిన్ను ఇట్లా గు ర్తించని వాళ్ళుకూడా వుంటారుగా. ఎవరు యెట్లావున్నా నీకరుణ ఒకటేగా అమ్మా?అందరూ ఒకటి గానే ఒక్కసారిగానిన్ను గు ర్తించే రోజువస్తుందా అమ్మా? అది నేనుచూస్తానా,అమ్మా ఆ బ్రహ్మాండంనిగూడా సృష్టించింది నీవే కదా! అది నీకు కనబడటమేమిటి? మాకు బోధచేయటం కోసం ఇవన్నీఆధారంగా తీసుకొని చెప్తున్నావు. సామాన్యురాలివిగాఒక రూపంతో వున్నావుగాదు, సూదిమోప సందులేకుండా వున్న అమ్మవు. సూదై కూర్చుంటివి. మొద్దు గుడ్డలుకట్టాలి. సన్న గుడ్డలు కట్టాలి. సిల్కు గుడ్డలు కట్టాలి. అన్నీ చెయ్యా ల్సిందేగా అమ్మా? నిన్ను సరీగా వాడుకోవటం చేతకాకపోతే విరగదీసి పెడతాం, ఇన్నీ నీకేగా యెందుకు పెట్టుకున్నావు? ఇంత యాతన ఎందుకమ్మా? యీ కార్యభారం?

అమ్మ : భరించలేనప్పుడేగా బాధ? "భరించలేనిదే బాధ"

మౌలాలి : అమ్మా నీకు కూడా పెళ్ళి అవసరమా?

అమ్మ : ఇప్పుడేగా చెప్పావు. సూదివయి కూర్చున్నానని. సూది అయిన తరువాత అన్నీ కట్టాలన్నావు కదూ?

మౌలాలి : యేమిటీ పిచ్చి ప్రశ్నలు నావి ? అది యే ఆదర్శం కోసం ? పెళ్ళి నీకు ఆదర్శమేకాని అమ్మా చూచేవాళ్ళకు బాధే. మొన్న మీ వాకిటికి మధూకరానికి వచ్చినప్పటి నుంచిముందు ముందు యెక్కువ బాధలే సృష్టించుకున్నావేమో అనుకుంటూ అహాం నన్ను మాత్రం, యెంత సత్యం నీవయినా, రాబోయే నీ బాధలు చూడకుండా, నీలో కలిపేసుకో. యెంత అన్నీ నీవనుకుం

టున్నా మొన్న మీ మేనత్తగారు తిట్టి గడపలో నెట్టి పడేసి నప్పటి నుంచి జ్ఞాపకం వచ్చినప్పుడల్లా బాధగానే వుంటుం దమ్మా. అమ్మ బంధువుల నందరినీ ఇలా స్పష్టించుకున్నదేమో ననుకుంటా. తన కోసం బాధపడే తల్లిని ముందర్తిగానే పంపించింది. అని ఇవన్నీ నాలో నాకే తోస్తూ వుంటాయి తల్లీ. నేను మెట్రిక్యులేషన్ చదువుకొనేటప్పుడు ఒక రోజున స్కూలుకు వెళ్ళి వస్తుంటే మొదటి రోజు మీరు కన్పించిన దృశ్యం కనుపించింది. మళ్ళీ ఎంత చూద్దామనుకున్నా కను పించలేదు. నాకు తెలియకుండానే "అమ్మా" అనే నామం ఆ రోజు నుండి జపం అవుతూనే ఉంది. ఆనాడే కనబడ్డ మంత్రోపదేశం చేసి అదృశ్యమైనావు. ఆ జపం యీనాడు ఫలించింది.

అమ్మ : బాగా ప్రొద్దుగూకి పోయింది. తాతమ్మ కూడా వచ్చింది. ఇంటికి వెళ్తాను మౌలా.

నంబూరు వెళ్తా నేమో 4 రోజులలో నువ్వు కూడా వస్తావా ?

మౌలాలి : నువ్వు రమ్మంటే వస్తా అమ్మా! రాక పోయినా వుండగల్లను ఇప్పుడు, ఇదివరకల్లెకాదు ఎప్పుడూ సాన్నిధ్యమే కనుక సాన్నిధ్యాన్ని సాధించాను గనుక చేయిస్తున్నావు. నేను వస్తా నిన్నుసాధించే పనిలేదు.

అమ్మ : నన్ను సాధించకుండానే, నా సాన్నిధ్యం నీకు సాధ్యమైందా?

మౌలాలి : లేదు లేదమ్మా! యేదో వక్రంగా మాట్లాడితే నీ నోటి వెంట అనేక రకం మాటలు వినవచ్చు.

అమ్మ : ప్రతిదీ నీకు తెలిసే మాట్లాడుతావన్నమాట.

మౌలాలి : అయ్యయ్యో లేదమ్మా! ఏదో అట్లా వచ్చింది. బయట్రేరమ్మా అంటాడు.

అమ్మ ఇంటికి వెళుతుంది. రాత్రి 7-30 అవుతుంది. అంతా భోంచేస్తారు.

తాతమ్మ : ఎక్కడ తిరుగుతున్నా నీవు?

అమ్మ : చింత చెట్లక్రింద చల్లగా వుంటే కూర్చున్నా

తాతమ్మ : ఇరుగు పొరుగు ఇంతమంది పిల్లలున్నారు ఆడుకోవు దమ్మా?

అమ్మ : రేపు అట్లాగే ఆడుకుంటా!

తాతమ్మ : అన్నం పెడతా పదా, తిందవుగాని

అమ్మ అన్నానికి వెళ్తుంది. తాతమ్మగారు దగ్గర కూర్చోబెట్టుకుని అన్నం కల్పి పెడుతుంది. అన్నం తిని అమ్మ, తాతమ్మ పక్కలో పడుకుని నిద్రపోతుంది.

మరునాడు సాయంత్రం 4.30 గంటలకు అమ్మ తోటలోకి వెళుతుంది. మౌలాలి పడుకొంటాడు. అమ్మ వెళ్ళి మౌలాలి దగ్గర కూర్చొంటుంది. నిద్రపోతున్నాడులే, ఎందుకులే అని వచ్చి ఇవతల కూర్చుంటుంది.

ఒక చండి ఉపాసకుడు "కొల్లిమర్ల సూరయ్యగారు" తోటలోకి చింత చిగురు కోసం వస్తాడు. వచ్చి అమ్మను చూస్తారు. ఎందుకో చింతచిగురు కంటే అమ్మ దగ్గర కూర్చుందామనిపిస్తుంది, వచ్చి కూర్చుంటారు. అమ్మను చూస్తూ వచ్చిన పని మర్చిపోతాడు. ఆయనకు శ్రీ విద్య, తంత్ర విద్యల మీద మంచి అభిమానం. యెవర్నీ సామాన్యంగా ఒప్పుకోడు. ఎందుకో అమ్మనుచూస్తే ఆయన ఇష్టదైవమనిపిస్తుంది. ఆయన అట్లాచూస్తూ వుండగానే శిరస్సులో నుంచి రక్తం చిచ్చుబుడ్డల్లే వచ్చినట్లు వస్తుంది. అదే సమయంలో భృకుటిలో గుండా వస్తుంది. యీ రెండూ సూరయ్యగారు చూచి ఆశ్చర్యపడి ఆ రక్తధారకు ఆయన చెయ్యి అడ్డం పెడతాడు ఆ చేతిలో పడ్డ రక్తం చక్కటి సువాసన కల భస్మం అవుతుంది. ఆ భస్మం కాస్తా నాకేస్తాడు.

సూరయ్య : అమ్మా నీ పేరేమిటి?

అమ్మ : నా పేరు అనసూయ అంటారు.

సూరయ్య : ఇక్కడ యెందుకు తోటలోవున్నావు?

అమ్మ : ఇంటి దగ్గర తోచక యెప్పుడన్న వచ్చిపోతూ వుంటా

సూరయ్య : మీ అమ్మ, నాన్న వున్నారా !

అమ్మ : అమ్మా, నాన్న వున్నారండి?

సూరయ్య : నీకీ రక్త ప్రవాహం ఎప్పట్నుంచి ?

అమ్మ : ఫలానప్పట్నుంచి అని తెలియదు. ఇప్పుడు మాత్రం వున్నద నుకున్నానా నేను

సూరయ్య : నీకు తెలియదామ్మా?

అమ్మ : యెవరో నీ బోటి వాళ్ళు చూచి చెప్తే తప్ప నాకేమి తెలియదు.

సూరయ్య : ఇంతకు ముందు నీకు యెవరన్నా చెప్పారా?

అమ్మ : కొండలరావు స్వాములవారు చూచి భజన చేస్తుంటే దగ్గరకు పిలుస్తారు. కూర్చోబెట్టుకొని తలకాయ తడువుతూ కూర్చు న్నారు. అప్పుడు యేమిటమ్మా ఇంత మెత్తగా వుంది; బ్రహ్మ కపాళం దగ్గర అని వత్తి చూస్తారు. చేతికి నెత్తురయింది' అనుకుంటారు. ఇదివరకు ఎప్పుడన్నావుందా అమ్మా అని అడి గారు. మీకు చెప్పిన మాదిరిగానే. నాకుతెలియదని చెప్పాను. అక్కడ వాసన చూస్తూ యీ ప్రదేశం ఎంత సువాసన అని అనుకున్నాడు. మళ్ళీ మీరన్నారు.

సూరయ్య ; ఇది సామాన్యమైన స్థితికాదు. తపస్సు ఫలించిన వాడికి గానీ రాదు. దీని కోసం ఆరేళ్ళు ప్రయత్నించా. చివరకు పొట్టకూటి కోసం వుద్యోగానికి పోయి అన్నీ మర్చాను. యేడు ఏళ్ళ పిల్ల

వాడి దగ్గర్నుంచి యెంతో భక్తిగా అన్నీ చేసుకుండ్డే వాడిని. 23 యేళ్ళ వరకు సాగింది. ఇప్పుడైనా ధ్యాసపోలేదు. క్రియ లేదు.

అమ్మ : ధ్యాస క్రియేగా ?
ఇంతలో మౌలాలి లేచి వస్తాడు

సూరయ్య : ధ్యాస కూడా క్రియేనంటావామ్మా!

అమ్మ : తప్పకుండా

సూరయ్య : అట్లా అయితే ఉద్యోగం మానుకొని ఇక్కడ కొస్తానమ్మా!

అమ్మ : నన్ను నమ్ముకొని రావద్దు నాయనా. చివరకు అసహ్యం వేస్తుంది. నన్ను చూస్తే నీకు కూడా. ఫలానా అమ్మాయి కోసం వచ్చావంటే నవ్వరూ? నా మీద ఎవరికీ సదుద్దేశంలేదు. నేనేదయినా మీకు చెపుతానంటే నా స్థితి నాకు తెలియదు. మీరు ఇది గుర్తుపట్టి చెప్పిందాక నా స్థితే నాకు తెలియదు. మీరు యీ విషయం యెక్కడన్నా చెప్పారంటే యేదయినా దెబ్బ తగిలిందేమో అంటారు. నా కంటే ముందు మిమ్మల్ని యెగతాళి చేస్తారు. నా రోజులు ప్రస్తుతం ఇటువంటివి.

సూరయ్య : నీ మాట చెప్పనమ్మా. ఎందుకో వచ్చాను అని చెప్పకుంటాను. యీ వూరు కాపురం వచ్చా నాకు చాలా సంతానం కలిగి నష్టమైంది. ఇద్దరున్నారు. ఇద్దరూ మూగ పిల్లలే. ఒక మగ పిల్లవాడు; ఒక ఆడపిల్ల. ఒక ఎకరం పొలమున్నది; ఐదువేల రొక్కమున్నది, ఆడ పిల్లను ఎవరు చేసుకుంటారు. ఎవరో పేదవాడికిచ్చి చేయాలి. కుటుంబ చిక్కులకేం లెండి. యేవేవో వుంటుంటాయి. మిమ్మల్ని వదిలిపెట్టి పోలేకుండా వున్నాను. నేను కొలిచే దేవతే మీరనిపిస్తున్నది.

అమ్మ : యెందుకు? నన్ను మీరు అంటున్నారు. అమ్మాయి అనక

సూరయ్య : అట్లా అనాలనిపిస్తుందమ్మా

మౌలాలి వింటూ కూర్చుంటాడు. విని; ఆమెకు తపస్సేమిటండీ తపస్సు అంటున్నారు? ఎవరికి ఏ రూపం ఇష్టమో యెవరికి ఏ స్థితి వుందో దానికి తగినట్లు దర్శనమిస్తుంది. ఎందుకు ఇవ్వగలుగు తున్నదంటే వీటన్నింటికి మూలం; మూలానికి మూలం; అమూల్యమైన ఆదరణ. ఆదరణగల అవతారం. అమృత తత్వమయిన అవతారమని కూడా అనవచ్చు. ఇది నా అభిప్రాయం పంతులు గారు.

సూరయ్య : నాకు ఇంత అర్థం చేసుకునే శక్తిలేదు. తమదేవూరు? అంటూ వుంటారు.

మౌలాలి : ఒక వూరని యేముందిలేయ్యా? ప్రస్తుతం ఈ వూరు.

అమ్మ : సరే! నేను వెళ్ళి వసాను మౌలాలీ. బహుశ ఇంకా మూడు రోజులలో నంబూరు ప్రయాణం తప్పదు.

మౌలాలి : నంబూరు యెక్కడ?

అమ్మ : గుంటూరు దగ్గర నంబూరు. నంబూరు వచ్చి కరణంగారి ఇల్లెక్కడ అంటే చెప్తారు. ఈ మూడు రోజులు నేను ఇటురాను.

మౌలాలి : నేను రేపే బయలు దేరుతానమ్మా

అమ్మ : సరే!

సూరయ్యగారు ప్రతి చెట్టుదగ్గర గుప్పెడు; గుప్పెడు చింతాకు కోసుకుంటూ వుంటారు.

అమ్మ బయలుదేరి వెళ్తూ వుంటుంది.

సూరయ్యగారు చింతాకు కోసుకునే వాడల్లా అమ్మ దగ్గరకు పరిగెత్తుకు వస్తాడు. అమ్మా నేనూ తప్పకుండా వస్తా యీ వూరు.

అమ్మ : నన్ను నమ్ముకొని మాత్రం రావద్దు. నేను ఒక వూళ్ళో వుంటా వని నమ్మకం లేదు.

సూరయ్య : పౌనీయ్‌లే అమ్మ ఏదో ఊళ్ళో ఉండేబదులు ఇక్కడే ఉంటాను.

అమ్మ : సరే! వుండండి మీ ఇష్టం

సూరయ్య : వెళ్ళొస్తానమ్మా అని నమస్కారం చేస్తాడు అమ్మకు,

అమ్మ : నా కెందుకు నాయనా నమస్కారం? నీకు నీవు చేసుకో. అచ్చగా నీకు నీవు చేసుకున్నా భగవంతుడికి చేసినట్లే. ప్రతి వస్తువుకు అంటే అన్నానికి, అశుద్దానికి కూడా. సరే! నేను వెళ్ళొస్తా. అని యెవరి దారిన వారు వెళ్తారు అమ్మ ఇంటికి వస్తుంది. ఇంటికి వచ్చేటప్పటికి దాదాపు ఏడు అవుతుంది.

రాఘవరావు మామయ్య నంబూరు లోనే వుంటారు. అమ్మ తెనాలి వారితో కలిసి వెళుతుంది నంబూరు. వడుగు అయింతరువాత కూడా ఇంకా 20 రోజులు అక్కడే వుంటారు. మౌలాలి అమ్మ కంటే ముందే నంబూరు చేరతాడు.

ఒక రోజు సావిత్రమ్మగారు (అమ్మ పినతల్లి బాగ్యమ్మ గారి కుమార్తె) అమ్మతో మాట్లాడుతూ

సావిత్రమ్మ : యేమిటి ఎప్పుడూ ఆలోచిస్తూ కూర్చుంటావు?

అమ్మ : "యేమి లేదమ్మా ఒక దాని గురించి ఆలోచించుదామనీ వుండదు. ఆలోచనలు అవి పాటంతట అవివస్తాయి." (పాపం యీ మాట అర్థం చేసుకొనేశక్తి లేదు.)

సావిత్రి : ఎంత పిల్చినారావు. రాకపోతే పోన్లే. రావా?

అమ్మ : (లేచి వెళుతుంది) ఎక్కడకు?

సావిత్రి : గోపాలరావు బాబుగారింటికి పోదాం.

(సావిత్రమ్మ గారికి పెదతండ్రి వరస) ఆయనకు భార్య పిల్లలులేరు. యీపిల్లల్నే ఆయన పిల్లలుగా చూచుకుంటారు. అన్నం ఆయనే వండుకుంటారు. కూరలు భాగ్యమ్మగారు పంపిస్తుంది. పిల్లలందరకు కలిపి ముద్దలేస్తుండేవారు. ఆయన దేవీపూజ దురంధరుడు. నిత్యము కుంకుమార్చన, అఖండం వెలుగుతూనే వుంటుంది. యీ పిల్లలందరూ యెక్కువగా ఆయన దగ్గర వుంటారు. వున్న ఇరవై రోజుల్లో అమ్మ పది రోజుల్లో అన్నం ఆయన దగ్గరే తింటుంది. ఒక రోజు అన్నం విస్తట్లో పెట్టగానే, నాయనా ఈ రోజు అన్నం నేను కలిపేది అన్నట్లు గోపాలరావుగారికి వినపడుతుంది. వులిక్కిపడి యెవరు ఆ మాట అన్నది? యెవరు ఆ మాట అన్నదిఅని మూడుసార్లు అంటారు. పెద్దపెద్ద కళ్ళు చేసి ఎవరు ఆ మాట అన్నది మీరేనా మీకు వినపడ్డదా అంటారు.

సావిత్రమ్మ : నోరు తెరవలేదు కాని అనసూయ గొంతులో నుంచి వచ్చినట్లున్నది ధ్వని; ధ్వని యీ గొంతులో నుంచేవచ్చింది గాని అది అనసూయ గొంతులో ధ్వనిగాదు శబ్దం మార్పుగా వుంది.

అమ్మ : "శబ్దమే ఒకటి – ధ్వనులు అనేకం"

గో.రావు రావు: బిత్తరపోయి బిత్తర చూపులు చూచుకుంటూ నాలుగు మూలలా వెతుకుతారు. నాలుగుమూలలా వెతికి యెప్పుడో ఒకప్పుడు తేలకపోతుంది. ఆ తల్లే ఈ రూపంలో వచ్చిందేమో

కానియ్యి కలుపమ్మా కలుపు అసలు అమ్మాయిని చూచినప్ప ట్నుంచి అనుకుంటూనేవున్నా దైవకళ వుట్టిపడుతూనే వుందని, ఆ జడ, ఆ పరికిణీలు గుమ్మటమల్లె, బాల త్రిపుర సుందరల్లె వున్నది. నా కెందుకో నిన్ననే అందామనిపించింది. దిష్టి తగులు తుందేమోనని వూరుకున్నా, కలుపమ్మా అని చెయ్యి పట్టుకుని ఒళ్ళోకి లాక్కుంటారు, ముద్దు పెట్టుకుంటారు. బుగ్గ మీద మూతి ఆనించి కళ్ళు మూసుకుంటారు అమ్మ మెడలు భుజం మీదకు వంచి అట్లాగే 2 గం॥లుంటారు. పిల్లను అందరూ ఇంటికి పరుగెత్తి యీ స్థితి అంతా చెపుతారు. అందరూ పరుగెత్తుకు వస్తారు. అమ్మ కళ్ళు తెరుచుకొని భుజం మీద పడుకొని వుంటుంది. ముందరవైపు చూచే వారికి అమ్మ కళ్ళు కనబడవు. వెనుక నుంచి చూచే వారికి గోపాల రావుగారి భుజం మీద అమ్మ తల, అమ్మ బుగ్గమీద వారి మూతి అమ్మ యెడమ కన్ను గ్రుడ్డు క్రిందివైపు త్రిప్పి ఆయన మూతిని చూస్తూ వుంటుంది. కుడి చెయ్యి అవతల భుజము మీద దాకా వుంటుంది. అమ్మ కుడికాలు మంచం పట్టిమీద నుంచి ఆయన తొడదాక వుంటుంది. ఒక కాలు క్రింద వుంటుంది. గోపాలరావుగారు ఒక కాలుమడత వేసుకుంటారు. ఒకటి కిందికి వుంటుంది. గోపాలరావు గారు ఒక చెయ్యి అమ్మ తలమీద, ఒక చెయ్యి అమ్మ వీపు మీద వేసుకుని ఉదయం 11 గం॥ నుండి సాయంకాలం 4 గం॥వరకు (అలాగే వుండిపోతారు) యిట్లాగే గడుస్తుంది క్రమంగా చాల మంది జనం చేరతారు. యేస్థితి అయింది తెలియక అయో మయంగా వుంటారు.

గోపరాజుగారు డాక్టర్ని పిలిపిస్తారు. డాక్టరు గారు చూచి శ్వాస లేదు. నాడి అందటం లేదంటారు.

గోపరాజుగారు గుంటూరన్నా తీసుకువెళదాం పిల్లను మెల్లిగా విడదీయండి. డాక్టరుగారు అమ్మను పిలుస్తారు. అమ్మ పలుకుతుంది. అమ్మ నోరు ఆయన గడ్డం క్రిందుగా వుంటుంది.

డా.గారు : యే అమ్మా విడదీసుకు రాలేవు? అంటూ వుండగానే యీ జన సమ్మర్దం విని మౌలాలీ వస్తాడు.

డాక్టరుగారు గోపరాజుగారితో తేజస్సు చూస్తే ప్రాణం పోయినట్లు లేదు. నాడి అందటంలేదు అంటారు.

మౌలాలి వాళ్ళ గందరగోళం చూచి మెల్లగా అనుకుంటూ వుంటాడు. ఆ తల్లి మాయ ఎవరు కనుక్కోగలరు ? ఏ బిడ్డకు ఏట్లా దర్శనం కావాలో అట్లా ఇచ్చి తరింప చేస్తుంది. ఒక్కొక్కరికి ప్రత్యక్షంగా కనబడేటట్లు ఇస్తుంది. ఒక్కొక్కళ్ళను మామూలుగా వుంచే వాళ్ళ యొక్క స్థితి వాళ్ళకు తెలియకుండానే తరింపచేస్తుంది. గడ్డం క్రింద కర్ర పెట్టుకుని నెమ్మదిగా అనుకుంటూ వుంటాడు. మౌలాలి ప్రక్కనే వున్న నంబూరి హనుమంతరావుగారు విని (గోపరాజుగారి దాయాది) బాబాయిఇటురా మాట అని అవతలకు తీసికెళ్ళి అదుగో నిల్చున్నాడే అని వేలు పెట్టి చూపిస్తూ అబ్బాయి ఇట్లా అంటున్నాడని ఆ మౌలాలి అన్నవన్నీ చెపుతాడు.

గోపరాజుగారు: (హనుమంతరావుతో) ఆ అబ్బాయి ఎవరు ఎప్పటి నుండి వుంటున్నాడు ఈ వూర్లో?

హనుమంతరావు: పది రోజుల నుండి చూస్తున్న నేను.

గోపరాజుగారు మౌలాలిని ఇవతలకు పిల్చి అడుగుతాడు.

యే వూరు ఏమిటి అని?

మౌలాలి : ఒక్క ఊరని ఏముంది తండ్రీ. ఊరూర అడుక్కు తింటూ వుంటాను.

గో॥గారు : యిట్లా అంటున్నావని మా అబ్బాయి చెప్పాడు. అమ్మాయిని నీవేమయినా ఎరుగుదువా?

మౌలాలి : నేనెరగనయ్యా, ఆ ముసలాయన సంగతి విచారిస్తే గొప్ప దేవీ పూజా సంపన్నుడని అన్నారు. అందుకని ఆ తల్లి యెవరి కెట్లా దర్శనమివ్వాలో ఇచ్చి తరింప జేస్తుందన్నాను. ఆయన కొల్చేది తల్లినే కదా! తల్లులు అందరూ ఒకటే కదా! కనుక ఆ తల్లే యీ తల్లి అన్నాను. ఆ తల్లి ఈ తల్లి రూపంలో ఎందుకు దర్శనమివ్వగూడదు? యీ తల్లే ఆ తల్లి ఎందుకు కాకూడదు? అంతే నాయనా నా భావం. అంతకంటే మరేమీ లేదు.

గో॥గారు : ఇదా అమ్మాయిని గురించి నీవేవో అన్నావు అంటేను అంటూ ఇవతలకు వస్తారు.

గోపాలరావు గారు తలఎత్తుతారు, అమ్మ తలఎత్తి ఇవతలకు వస్తుంది.

గోపాలరావు గార్ని గోపరాజు గారు అడుగుతారు ఏమిటి అన్నయ్యా అసలు పరిస్థితి.

గోపాలరావుగారు: జరిగిందంతా చెపుతారు. చెప్పి అమ్మాయి ముద్దువచ్చింది నాయనా. ముద్దు పెట్టుకుంటే అతుక్కుపోయినట్లు వుంది. తరువాత యేంజరిగింది తెలియదు. అమ్మాయి రూపం మాత్రం

ఒకటి ఎదురుగా కనబడుతున్నది. అమ్మాయిని బాలా త్రిపుర సుందరిగా భావన చేసాను వచ్చినప్పటి నుంచి.

మనోభ్రమ అనుకుంటూ గోపరాజుగారు వెళతారు.

గోపాలరావు గారు మత్తుగా అట్లాగే పడుకుంటారు.

అమ్మ ఇంటికి వస్తుంది. అప్పుడప్పుడు గోపాలరావుగారు అమ్మను చూచిపోతూ వుంటారు, యెక్కడుంటే అక్కడ.
అమ్మ యింటికిరాగానే.

అన్నమ్మగారు: ఏమిటి అక్కడ యేమి జరిగింది? అని అడుగుతారు·
(అమ్మ పెదతల్లి)

అమ్మ జరిగిదంతా చెపుతుంది.

అన్నమ్మగారు: నిజమే మరి. ఆ పోయిన సొమ్ములన్నీ పెడితే బాలా త్రిపుర సుందరల్లెనే వుండేదానివి. రంగమ్మ తల్లికి ప్రాప్తంలేదు గాని చూచుకునేందుకు, సంతానం కోసం ఏడ్చి ఏడ్చి కళ్ళు పోయి నాయి· బతకొచ్చేటప్పటికి దానికి కాలం లేకుండా పోయింది. అని బాధపడుతుంది.



